శ్రీరామ

# రామచంద్రప్రభుశతకము.


కూచి నరసింహముచే

రచింపఁబడినది.





(మొదటికూర్పు.)

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.





1931.

[వెల 3 అణా

శ్రీరామా.

# పీ ఠి క.

నాసహోపాధ్యాయవర్గములోఁ జేరి యిటఁ గొంతకాలము పనిచేసిన మిత్రులొకరు నన్నుఁ జూచుటకు వచ్చి "మీ రొక భక్తి శతకము చేయరాదా?" యని యడిగినారు. జరామయావస్థకును సరస పద్యరచనకును నరిపడ దని యెఱిఁగినవాఁడ నగుటచే నవ్వు జెట్టి ప్రత్యుత్తరమును ఆయన కీయలేదు, గాని పిమ్మట "రచనాప్రావీణ్యమున కేమి? పతితపావనబిరుదాంచితుఁ డగు శ్రీరామచంద్రమూర్తిని నోరార నూఱుసారులు పిలుచు మహానందము లభించుట తప్పదుగదా! ప్రయత్నించి మిత్రవాక్యము నేల చెల్లింపఁగూడదు?" అను తలఁపొకటి కలిగినది. తదనుసారముగాఁ బద్యములు వ్రాసి భారతీపత్రికాధికారులకుఁ బంపఁగా వా రవి యీవఱకే తమ పత్రికారాజములోఁ బ్రకటించినారు.

చదివినసద్గ్రంథములయొక్కయు వినినపెద్దలసూక్తులయొక్కయు స్మృతినిబట్టి, స్వానుభవమునుబట్టి, లోకజ్ఞానమునుబట్టి, పొడమిన కొన్ని భావము లీపద్యములలో వ్యక్తీకృతములై యున్నవి. అవి, భక్తిజ్ఞానములకును సత్కర్మాచరణమునకును నీతికిని రాజనీతికిని బ్రహ్మచర్యాదిముఖ్యధర్మములకును సంబంధించియున్నవి గాన, యువజనోపయోగకరములు గావచ్చును.

కొందఱు స్నేహితుల ప్రేరణమున భారతీపత్రికనుండి యెత్తి యీరామచంద్రప్రభుశతకమును బుస్తకరూపముగా నచ్చొత్తించుచున్నాను.

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు!

పిఠాపురము.
8-6-1931

సుజనవిధేయుఁడు
కూ చి న ర సిం హ ము.

శ్రీరామా

# రామచంద్రప్రభుశతకము.

శా. శ్రీల న్మేలగుచేలల న్నగల నర్థింపంగలే, నింక నే
వేళ న్నామతి శాంతి కడ్డముగ నావిర్భూత మౌచుండు ను
ద్వేలాంతఃకరణప్రవృత్తులను భక్తి న్నీకు మత్తేభ శా
ర్దూలాకారపుఁగాన్కఁబొమ్మలుగ నిత్తు న్రామచంద్రప్రభూ! 1

మ. శతకంబు ల్రచియించి తొల్తఁ బిదప న్సామర్థ్యముంబట్టి తా
మితరగ్రంథముల న్బొనర్తు రిలలో నేరేనియు; న్దాని త
ద్వ్యతిరిక్తంబుగ సర్వదేహ్లపయి రెండౌ వెన్కనేఁ జిక్కితిన్
శతకం బొండు రచించి నీ కొసఁగుకాంక్ష న్రామచంద్రప్రభూ! 2

మ. వృకసందోహము పొంచి యుండి పొలమందేకాకిగా నుండువృ
ద్ధకుఁడుద్భ్రాంతముపైకి దూఁకుగతి, దుర్దాంతాధులు న్వ్యాధులున్
జకితస్వాంతత నుండున న్నటమి యేఁచ న్వచ్చె! గోపాలనా
మక! రక్షించుట కీవె శక్తుఁడవు రమ్మా! రామచంద్రప్రభూ! 3

శా. ఎన్నే నున్నవి నామరూపములు నీ కెన్నో చరిత్రంబులున్,
గన్నారం గని వీనులార వినితి గ్రంథంబుల; న్దాని యే
తన్నామాకృతిదివ్యవృత్తములు హృత్తాపంబుఁ జల్లార్చి నా
కెన్నన్రానిముదం బదేమొ! యిడుఁ దండ్రీ! రామచంద్రప్రభూ! 4

శా. సంతం బెట్టెడుచిత్తవృత్తులను జంపన్నీ శుభాఖ్యోత్కరం
బెంతో శ్రద్ధ జపింపఁజూడ నకటా! యేమొక్కడ న్నిల్వ కీ
స్వాంతం బన్యపి యిచ్చవచ్చినటు సంచారంబుఁ గావించెడున్,
శాంతిస్థైర్యము లిమ్ము దానికి రమేశా! రామచంద్రప్రభూ! 5

శా. అంతంబందున నెట్టులుండు మతి భా♦వ్యం బుండు నోట్లన్నసి
ద్ధాంతంబు న్స్మరియింపఁ గంప మొదవున్! ♦ ప్రాణావసానావధిన్
స్వాంతం బేస్థితి నుండునో యెవఁడు చె♦ప్పంజాలు? నా మ్రొక్కు ల
ర్పింతు న్నీకిదె! యిప్డె! సద్గతుల నీ♦వే! రామచంద్రప్రభూ! 6

శా. బాధ ల్రోఁతలు నన్ను లెక్కడుగ సే♦పల్చేయునావశ్యమున్
గ్రోఘం బిట్టివి లేని సన్మృతియు, హృ♦త్క్లేశంబునం దప్డ స
ర్వాఘవ్యాధిహరత్వదీయశుభద♦వ్యాంఘ్రిద్వయి న్నిల్పుకొం
చె ధైర్యంబున నుండుపాటవము, నీ♦వే! రామచంద్రప్రభూ! 7

శా. అన్యార్థంబు లొసంగు మంచునినునే ♦ యాచించి పీడింప, ని
ర్దైన్యంబైన సుజీవనంబు, విగతే♦ర్ష్యాలోభదుర్భీరుతా
మన్యస్వాంతవిశుద్ధియు, స్పరులక్షే♦మంబు న్సదాకోరుప్రా
వణ్యంబు, న్దయసేయు దీనజనక♦ల్పా! రామచంద్రప్రభూ! 8

మ. పరశర్మప్రదకృత్యము ల్సలుపఁబో♦వ న్ధర్మరాజి న్స్పర
స్పర వైరుధ్యము దోఁచి మానసము క్షో♦భం బొందు నప్డప్డు; డ
త్తటి నే దానిని పీడదేనిఁ గొనఁ గ♦ర్తవ్యంబొ బోధించి, న
న్సరియామార్గమునందుఁ బెట్టు పరమే♦శా! రామచంద్రప్రభూ! 9

మ. ధరలో నందఱు సౌఖ్యమొందుదురుగా♦త న్నీకృప న్సర్వదా!
యొరుల న్వాఙ్మనసంబుల న్క్రియల నే ♦ నొక్కప్పుడు న్బాధలన్
బొరయంజేయక యుందుఁగాక! యను సం♦పూర్ణాభిలాష న్నిరం
తరము న్నే మనుస గ్గొనర్పు పరమా♦త్మా! రామచంద్రప్రభూ!

శా. ఖ్యాతి న్నాతిగఁ జేసి ప్రోచెడుసమ♦ర్థత్వంబు నాదేకదా!
క్రోఁతి న్నిస్తులభక్తుఁ జేయఁగలనే♦ర్పు న్నాకెగా యుండు! న
న్స్వేతోగర్వము నొంద! కేవ జడతా♦చిత్తోరులౌల్యంబుల
నాత్రితి న్గోఁతినిమింపువాఁడు గలఁడే♦న్నా రామచంద్రప్రభూ! 11

మ. పతిపత్నీసుతసోదరప్రభృతు లాపత్కాలమందు న్బలా
యితులై పోదురు చెట్టలైన విడి; సద్వృత్తంబువా రైనచో
మృతులై పోవుదు కాక తాము పయిగా వ్యాప్తాపముం దెత్తు: రీ
గతి సంసారము నమ్మియుంట వెతయేగా! రామచంద్రప్రభూ!

మ. పరుషోక్తు ల్వచియించి చిత్తమును నొవ్వంజేయఁగా నెవ్వఁడే
దొరఁకొన్నన్ బ్రతినిష్ఠురోక్తులను దద్దుష్టత్వవహ్ని న్స్మరిం
త రగుల్పం గ్షమకింపకుండ నతిశీతక్షాంతివాగ్వృష్టి రూ
పఱఁ జల్లార్చుపటుత్వ మీఁకె పగమే శా! రామచంద్రప్రభూ! 13

శా. వీరి న్వారిని జూచి స్వాన్యపగతిన్ భిగ్రస్తచిత్తంబుతో
నోర న్సత్యము రాఁగనీక కస్పృశ్యసుద్రోహంబుల న్బల్కున
ద్దారిం బట్టక యొట్టిపట్టులను సత్యంబేవినీతో క్షుర్లౌ
ధీరస్వాంతత వెల్పు బుద్ధి నిడు తండ్రీ! రామచంద్రప్రభూ! 14

శా. ఆపత్కాలమునందుఁ గుంగఁబడి దైన్యం బంద కుద్దామ సౌ
ఖ్యాపాదస్థితిఁ గ్రిందు మీఁద రయ కత్యౌద్ధత్యముం బొంద కే
యాపత్సంపద లెప్పు డెంతగను సంప్రాప్తించిన, న్నిశ్చలం
బై పొల్పారెడుచిత్తము న్గరుణ నీవా! రామచంద్రప్రభూ! 15

శా. కన్ను ల్గల్గిన బుద్ధిగల్గిన భవత్కల్యాణధర్మంబు లా
పన్నత్రాణపరత్వముఖ్యమహిమల్ స్పష్టంబుగాఁ దెల్పఁ బై
మిన్నున్ గ్రిందివిచిత్రవస్తునుయ భూమిన్; దర్క వేదాంతవి
ద్యాస్పత్యం బనవశ్యకష్ట మగుఁజుమ్మీ! రామచంద్రప్రభూ! 16

శా. ,, నీకర్మంబున వచ్చినట్టిదొసఁగు ల్నే నెట్లు పోఁగొట్టి నిన్
సాఁకం గల్గుదు " నందువే సరియె! కష్టంబు లొలంగింపఁగా
నీకు న్నాపయి లేనిచోఁ గరుణ తండ్రీ! వాని నే సైఁచుకోఁ
జేకూర్పంగదె చాలుతాల్మి యయుర్క శ్రీరామచంద్రప్రభూ!

మ. వసనాన్నౌషధసంగ్రహార్థ మొరుల♦న్బ్రార్థించియో విత్తపుం
బస లేనట్టిస్వబాంధవప్రకరము♦న్బాధించియో వార్ధకం
బు నసంజేయక స్వార్జితార్థమున న♦న్పోషించుకోఁగల్గు పూ
ర్ణసమర్థత్వ మసుత్తుయంబువలఁ కీ♦రా! రామచంద్రప్రభూ! 18

మ. కరు లింతే నొనరించినట్టిహితము♦న్బ్రల్మాలి సాపేక్షతన్
మఱవంబోక, నిజోత్కటోపకృతు లై♦న న్జిత్తమం దింతయున్
స్మరియింపం జన, కెవ్వ డన్యులకు క్షే♦మంబు స్ఘటింపంగ నౌ
తెరువు న్వీడక పట్టి న న్మరుగని♦త్తే? రామచంద్రప్రభూ! 19

మ. ఇహాపూర్వాచరితోరుసత్క్రియలచే♦ నేఁ, గాక నీదానను
గ్రహముం గాంచుటనేని, చేకుఱుసుఖ♦వ్రాతంబుతోఁ దుష్టినొం
ది హృది న్శాంతముచేసికొంచు ద్రవిణా♦దిప్రీతిఁ బోనాడి ని
స్స్పృహత న్గాలముపుచ్చి ని న్మనయనీ♦వే! రామచంద్రప్రభూ!

మ. ప్రణుతస్ఫారవిచిత్రసృష్టిగతదు♦ర్వైషమ్యనైర్ఘృణ్యకా
రణము ల్తర్కముచేత నెవ్వరికి న♦గ్రాహ్యంబులే! కాని నే
ర్పున ని న్మానసమందుఁ గట్టి నిరతి♦న్బూజించి సేవించుధ
న్యునకు న్గన్నులఁ గట్టినట్టె యగునే♦మో! రామచంద్రప్రభూ! 21

శా. దివ్యంబైన సువర్ణ మూఁ బరుసవే♦దిం దాఁకి యి; న్మట్టులే
భవ్యత్వత్పదభక్తు నంటఁగనె దు♦ర్వారంబులై సర్వ మ
స్తవ్యస్తంబుగఁ జేయుకష్టములు నా♦సౌఖ్యంబు! లోదేవతా
సేవ్యా! నీమహిమంబు లెన్నఁదరమా? ♦ శ్రీరామచంద్రప్రభూ!

శా. శంపావిగ్రహ మైతి తొల్తఁ, బిదప♦ స్వాన్మోదకాంభోదవ
ర్ణపుంగోమున సచ్చరిత్రమున నా♦ర్తత్రాణశౌర్యంబులన్
బెంపుం గాంచిన రాఘవుండ వయి, తా♦వెన్క న్సమస్తాంతర
స్థంపుంజిత్సుఖసత్యమూర్తి వయి తీ♦శా! రామచంద్రప్రభూ! 23

శా. బొమ్మ ల్వీడక యాడుబాలుఁ డెదుగ ♦ న్బోనాడి యాబొమ్మలన్
గొమ్మ న్గూడి సుఖించుమాడ్కిఁ దరుణీ♦నో భూయశోవిత్తసౌ
ఖ్యమ్ము ల్గోరిలుచునుండువాఁడు నినుఁదాఁ ♦ గాంచంగనన్నింటిఁబో
పొమ్మంచు న్నిను నంటియుండు సతతం♦బు న్రామచంద్రప్రభూ ! 24

మ. అమితంబౌ ఫల మిచ్చు గొప్పక్షితిజం ♦ బౌ మున్ను బీజంబుతా
సమయంగావలె నేల; నట్లె భువిపైఁ ♦ జాలంగ సన్న్యోపకా
రములం జేయు నుదారతత్త్వ మగు పూ♦ర్వాంబం దెటో యీయహ
మ్మమకారాత్మకతత్త్వ మీల్గవలెఁ జూ♦మ్మా ! రామచంద్రప్రభూ !

శా. వారాశి న్జనియించు నుప్పున నౌన♦ర్వంబద్ద పాంచాలియా
వారాశిం బడి లోఁతు గన్గొనఁగఁబో♦వ న్లీనమైపోవు నం;
దారీతి న్గన నీదుపేర్మిఁ జని శు♦ద్ధాత్ముండు నీలోననే
చేరు న్బేరును రూపుమాపుకొనుచున్ ♦ శ్రీరామచంద్రప్రభూ ! 26

శా. బంగారంబున నుండు దోషముల వి♦ధ్వస్తంబుగావించి మే
లింగు న్దానికిఁ దెచ్చువహ్నిపగిది ♦ న్బ్రాణివ్రజంబున్గడుం
గ్రుంగంజేయుచు నేఁచు నాపదలుత ♦ దూరక్షుత్వకాలుష్యముల్
త్రుంగంజేయుచుఁ జేయు జీవుఁ బరిశు♦ద్ధు న్రామచంద్రప్రభూ ! 27

శా. ప్రేమం బింతయు లేక నీదెసను దు♦ర్వృత్తంబుతో నుండి యిం
కామీఁద న్జదు వెంతగాఁ జదివిన ♦ న్వ్యర్థంబె ! యాపండితుల్,
నీమాన్యాఖ్యలు నోటఁ బల్కుచిలుక, ♦ ల్నీగీతము ల్పాడు నా
"గ్రామోఫో'నులు, నన్యమోదకరులే♦గా ! రామచంద్రప్రభూ! 28

శా. ఏనామంబున నెట్టిరూపమున నిం♦కేభాషలోనైన ని
న్ధ్యానంబందున నిల్పి యర్చనము సే♦య, న్నీవు ప్రీతుండవై
వాని న్బూతుని జేసి యిచ్చెదవు ని♦ర్వాణంబె; యాఁగాని యా
ధ్యానం బచ్చలమై యొసంగవలె న♦య్యా ! రామచంద్రప్రభూ! 29

మ. అమితభ్రాంతి గలట్టిచక్ర మిసుమంతైన స్ఖలింపంగలే
ని మహామాంద్యపుఁజక్రిమొక్కగతిఁ గాన్పించు న్బహిర్దృష్టికిన్;
శమయుక్తంబగు సత్త్వము స్థమముఁ గాన న్వచ్చుఁ బై కల్గె యే
కముగాఁ బెక్కుర మోసపుచ్చుచు శుభాంగా! రామచంద్రప్రభూ!

మ. విసరు ల్తక్కుకు చేష్టలుం దొఱఁగి సద్వృత్తంబులై తోలఁ గై
వసమై గుఱ్ఱము లున్న, హాయి విహరింపన్వచ్చుఁ దత్స్వామి; మా
నిసికి న్లొంగి దశేంద్రియంబులటు వానిం ద్రిప్పులం బెట్టకు
న్న సుఖం బొందును నందు నొందు సతిఁ డన్నా! రామచంద్రప్రభూ!

మ. పొగయంత్రంబున కంటఁ గట్టుశకటంబుం బోలి, మార్జాలినో
టఁ గడు న్నేర్పునఁ బట్టుకూసవలె, నేడం గష్టముం జెందకుం
డఁగ జీవించును మానవుండు తనదెందంబు న్గతాహంకృతిన్
భగవచ్చిత్తముతోడఁ గెల్పుకొన, సన్నా! రామచంద్రప్రభూ! 32

శా. జ్ఞానం బంచును భక్తి యంచు నవియో కర్మంబు లం చింక సే
వానిం జేయ విలాతికి న్దమకు లాభంబు న్సుఖం బౌనో య
వ్వాని న్మాని నిరర్థకక్రియలతోఁ బ్రాల్మాలిక న్బ్రాయముం
బోనీఁ జూతురు కొంద; అద్ది ఫలదంబో? రామచంద్రప్రభూ! 33

మ. జనవాక్యం బన్యాయోక్తియైనను బ్రజాసంతుష్టికై యాజగ
జ్జనని న్నీసతిఁ బాపకొంటివి! ప్రజల్సౌఖ్యంబు వాక్రుచ్చి కో
రినఁ, గల్లమ్ముట మాన్పి దాన నగు దూరిక్థంబు వర్జింపనే
రనివా రైరిక నేఁటిభూమిపతు లారా! రామచంద్రప్రభూ! 34

మ. పరభూపాలుర నోర్చి తెచ్చువసుసంపత్తి న్స్వదేశీయులం
బొరయం జేసిరి పూర్వమందు నృపు; లిప్డో! దేశభాగ్యంబుఁ జె
చ్చెర దూరస్థవిదేశవాసులను నిశ్చింతంబుగాఁ జేరని
త్తురు భూభర్త! లధర్మకార్య మిది గాదో! రామచంద్రప్రభూ!

శా. నేఁ డుచ్ఛస్థితి నున్న దేశవిభుఁ డెం◆దే తేని కేమాత్రమీ
త్రోడై వానిని దాను రాజ్యపదము◆క్తుం జేసి పాలించు; నా
నాఁ డర్కాత్మజరావణానుజులకు◆న్సాహాయ్యముం జేసి చూ
డాఁడ న్లేదు తదర్థ మీ విఁక మహా◆త్మా! రామచంద్రప్రభూ! 36

మ. పరదేశంబులనుండి రావలయు స◆ర్వంబుల్; స్వదేశస్థు లె
వ్వరు సంధానము జేయలేరు; పరికిం◆పంగ న్పరాపేక్ష యు
ద్ధుర మౌచున్న; దశక్తి హెచ్చుకొలఁది ◆ న్దుర్భోగవస్త్వాశయుం
బెరుఁగం జొచ్చె; నిఁకేమి చేసెదవొ సు◆మ్మా! రామచంద్రప్రభూ!

శా. ధీమంతుం డగు మానవుండు తనబు◆ద్ధి న్లోకబాధాపహం
బై మోదంబును గూర్చు నౌషధములు ◆ న్యంత్రంబులు న్జేయనౌ;
నామూలం బిఁకఁ బ్రాణులం గడపుదు◆ర్యంత్రాదుల న్జేయుటం
తో మారాత్మకదైత్యకృత్య మగు న◆య్యో! రామచంద్రప్రభూ!

శా. ధీరత్వంబున నాత్మతేజమున ను◆ద్దీపించి దేశార్తులన్
బాలందోళిల నహింసఁ బూని తమకౌ◆బాధ ల్సమ న్సైఁచుచున్
ఘోరంజొచ్చుస్వకీయులన్ ధనముకై ◆ పోకార్చి ధర్మంబులన్
గారం బెట్టుట పట్టెనీచకృతి యాఁ◆గా! రామచంద్రప్రభూ! 39

మ. ఇతరు ల్గేహము సొచ్చి పాలనము తా◆మే సేయుచుండ, స్వతం
త్రతతో నన్నియుఁ జావ, వా రొసఁగుప్రా◆ణత్రాణమాత్రాన్నపుం
బ్రతుకే దీనత నింపభోగ మనుచు ◆ న్భావించు గేస్తుండు తా
మతిలేనట్టినరుండు గాఁడె? గుణధా◆మా! రామచంద్రప్రభూ! 40

మ. ప్రజల న్బిడ్డలఁబోలెఁ జూచుకొనుచు ◆ న్స్వార్థసౌఖ్యాదులం
దు జగత్ఖ్యాతిని బొంద నేలఁగ సమ◆ర్థుం డెవ్వఁ డాతండె పో
నిజమౌరా; జెఁక వారిలో జగడము ◆ ల్పెక్కొల్పి తా మించుతే
ని జగాముప్రచ్ఛని కాక రా జనఁగఁ జ◆న్నే? రామచంద్రప్రభూ!41

శా. ఆయాసక్షమ, నైకమత్యము, దపీ♦యశ్చింతయు, స్థైర్యమున్
స్థేయోయత్నము, దేశభక్తియు, నకుం♦ఠీభూతకౌశల్య, మాం
గ్లేయు ల్చూపుదు; రవ్వి మా కెపు డిట ♦ న్లేవో! గతంబయ్యెనో!
యీయంగూడదె వాని మాకుఁ గృపఁ? దం♦ద్రీ! రామచంద్రప్రభూ!

మ. మఱి నాంగ్లేయులు భూనభంబులకు సం♦బంధంబుఁ గల్పించి, తెం
పరులై భూతము లైదిటి స్స్వమహిమ ♦ న్బంధించి, యేర్పాటులన్
బరమాశ్చర్యకరప్రవీణతలు చూ♦పం జొత్తు! రవ్వేల నీ
కరుణ న్మాకు లభింపఁగూడ? దసితాం♦గా! రామచంద్రప్రభూ! 43

మ. ఉరువై యుండును దప్ప కింద్రియబలా♦యుర్దైహికారోగ్యముల్
స్థిరకాంతారనివాసమూఢమతి; కు♦ద్వేలంబుగా విద్యనా
గరకత్వంబును వానికిం గఱప, సౌ♦ఖ్యం బిచ్చుపై వన్నియున్
దఱుఁగు; న్నే మిఁక వేనిఁ గోర నగు? సీ♦తారామచంద్రప్రభూ! 44

శా. చేతిం దండ్రి కొసంగి బాలకుఁడు దాఁ ♦ జిత్తానుసారంబుగాఁ
బాతం బందక తిర్గఁగల్గు; నటు మా♦స్వాంతంబు నీ కిచ్చి యే
యాతంకం బిఁక మేము గాన కెపుడు ♦ న్హాయిన్ యథేచ్ఛంబుగా
వీతత్రాసులమై మెలంగఁగల ము♦ర్వి న్రామచంద్రప్రభూ! 45

మ. వినయోపేతుఁడు సౌమ్యభాషణుఁడు నౌ♦విద్వాంసుఁ,డే తన్నుఁబొ
డ్చును లేనట్టిప్రపూర్ణదుగ్ధగవిఁ దాఁ ♦ బోలు; న్గదున్ జిఱ్ఱుబు
స్సనువిద్వాంసుఁడు రెండుఁ గల్గి యిఁక న♦త్యల్పంపుఁబాలిచ్చును
స్రిను బోలు న్గాఱగాక యేరికి రమే♦శా! రామచంద్రప్రభూ! 46

శా. నాసామూలము నంటు నట్లు తిరుమం♦ట న్దాల్చు రేఖాద్వయం
బౌ, సత్కర్మము జ్ఞానము; న్నడిమిశో♦భాన్వితపుంగీఁతరం
గౌ సద్భక్తియె; మూఁడుత్రోవలకు గ♦మ్యస్థాన మేకంబె; యే
వాసిం గాంచరు వానిలో బుధులు దే♦వా! రామచంద్రప్రభూ! 47

శా. పంగుత్వంబును దృష్టిలోపమువలెం • బాపస్వభావంబునున్
సంగీతంబున కడ్డురా; దితరమౌ • శాస్త్రంబులు న్నీతిలే
మిం గీడ్పాటును జెంద వంతగ నిజం•బే, కాని నీభక్తిఁ గాం
చంగంజాలఁడు నీతిబాహ్యుఁ డెవఁ డీ•శా ! రామచంద్రప్రభూ!48

మ. అఱపద్దెంబున ధర్మ మెల్లఁ బ్రతిపా•దింపంగ నౌనట్లు ల్వాజ్యలౌ
పురుషు ల్పూర్వులు వల్కినారు- కన నే•ఁ బుణ్యంబు నన్యోపకా
రరతిం, బాపము నన్యపీడన మొన•ర్పం గోరఁగా- నం చిఁకన్
దరియింపం బెఱబోధ మేల ? మహితా•త్మా ! రామచంద్రప్రభూ!

మ. శిరమౌ నింద్రియనిగ్రహంబు, దమ,మ•స్తేయంబు, శౌచంబు క్షాం
తి, రుషాభావము, బుద్ధి, మంచిచదువు, • స్థిరత్వము, న్సత్యమున్
పది ధర్మంబు లటంచుఁ దొంటి స్మృతి *తా • వ్రాకుచ్చుస్పష్టంబుగాఁ;
దరియింపం బెఱబోధ మేటికి ? మహా•త్మా ! రామచంద్రప్రభూ!

మ. ధరణి న్మానవుఁ డేయుపాయముననో • తా నెట్టిదా దేహినో
పొరయం జేయవలె న్ముదం; బదియె యాఁ • బ్రాణేశ్వరారాధనం
బరయంగా; నని శ్లోకమందు నొకధ•న్యాత్ముండు బోధించెడున్;
దరియింపం బెఱబోధ మేల ? పరమా•త్మా ! రామచంద్రప్రభూ !

మ. ధరిలో శూరుఁ డనన్జితేంద్రియుఁడె; స•ద్ధర్మంబుల న్నిత్య మా
చరణంబందునఁ జూపువాఁడె కృతి; వా•క్యాంతుండు సత్యోక్తి;
యరయ న్భూతిదయాగరిష్ఠుఁడె వదా•న్యాగ్రేసరుం; డంద్రుగా
తరియింపం బెఱబోధ మేటికి ? మహా•త్మా ! రామచంద్రప్రభూ !

మ. అనిశంబు న్సుఖుఁ జూచి మైత్రి, కృప దుః•ఖార్తు న్విలోకించి,
ణ్యుని వీక్షించి ముదం, బపుణ్యుఁ గనుచో • నోపేక్షతావృత్తి,

*మనుస్మృతి.

వస లీమాడ్కిని బోవుచో నొదవు సు♦స్వాంతప్రసాదం బటం
చను సూత్రం*; బది నాకు నీ వొసఁగ వ♦య్యా! రామచంద్రప్రభూ!

మ. అది యిమ్మంచు ని దిమ్మటంచు నిను నే♦నర్థింపఁగా నా కెదన్
బెదరౌ; దానను నాకు మే లగునొ పి♦ర్వేఁ కౌనొకించిజ్జ్ఞుఁడన్
విదితం బౌ నెటు నాకుఁ ? గాన, నెది గా♦వింపంగ నీ కిష్టమో,
యదె కా నిమ్మని వేఁడుకొందుఁ బరమా♦త్మా! రామచంద్రప్రభూ!

మ. శివునిం జూడ నటంచు వైష్ణవుఁ, డిఁక ♦ న్శ్రీజాని నేఁ జూడ నం
చు విరోధంబున శైవుఁ, డందు; రెవలోఁ ♦ జూడంగ లే దిర్వురం
దెవఁడు న్వారియథార్థతత్త్వ; మదియే ♦ వీక్షించుచో నేకమౌ
శివుఁడు న్విష్ణువును సర్వదైవతములు ♦ న్శ్రీరామచంద్రప్రభూ! 55

మ. మనముం జూడఁ బ్రమేయమైన; దిఁక నీ♦మాహాత్మ్యమో! కాలదే
శనిమిత్తంబుల దాఁటియుండుఁ; గనుక ♦ న్స్వాంతంబున న్నిన్నుఁగాం
చ నశక్యం; బది గిద్దలోపలను గుం♦చంబు న్గుదింపంగఁజూ
చినయట్లుండును హాసపాత్ర మగుచు ♦ న్శ్రీరామచంద్రప్రభూ! 56

శా. కాన న్వచ్చియు బాహ్యభేదములు డె♦క్క న్బుత్రవర్ణాదుల,
న్లోనన్ గ్రంథముమాత్ర మేకమయియుం♦డుం బెక్కుటన్; బాహ్యమౌ
వానిం ద్రోసి మతంబులం గనిన లో♦ భాసిల్లు తత్వం బటే
కానంగా నగు నొక్కతీరున శుభాం♦గా! రామచంద్రప్రభూ! 57

శా. స్వామీ దిక్కిఁక నీవె నాకనెడువి♦శ్వాసంబుతో. స్వీయమౌ
సామర్థ్యంబును నమ్మసేయక ధృతి ♦ న్సాంసారికవ్యాపృతి
స్తోమంబుం బచరించుభక్తునకు నీ♦తోడ్పాటు ప్రాప్తించుఁ దా
నేమార్గంబుననో సకాలముగఁ దం♦డ్రీ! రామచంద్రప్రభూ! 58

---

* పాతంజలయోగసూత్రము.

మ. పరులం దుండెడు తప్పు లెంచి సవరింపం జూచుకంటె న్ననున్
దురితాపేతుని దోల్తఁ జేసికొను టెంతో మంచి, దే మన్న, న
క్కరణి న్నేను మెలంగినం, దఱుఁగు లోకంబందుఁ బాపాళి నా
క్కరుఁ డైన, న్మహి కద్దిలాభమె యగుంగా! రామచంద్రప్రభూ!

మ. నిసువుం దల్లి జలంబుతోఁ గడిగి మేనిన్ శుభ్రముం జేసినన్
వెస బూడ్దం బడి వాఁడు చేసికొను దాని న్వెండి యేవంబుగా;
నసిగాఁ జేసి గురుండు చిత్తమును దాఁ జన్నంత, శిష్యుండు న
ల్లై సుఖాభాసములందుఁ జిక్కి చెడుఁ దండ్రీ! రామచంద్రప్రభూ!

మ. సరిగా వంకరఁ దీర్చి కుక్కరపుఁబుచ్ఛం, బద్ది విడ్వంగనే
మరల న్వంకరపోవుఁ దొంటిగతి; సమ్మాడ్కి న్మహా తేజుఁ డొ
క్కరుఁ డేతెంచి ప్రపంచ మచ్చముగఁ దాఁ గావించి యేగంగనే
తిరుగ న్గిల్బిష మంది చెందునది యార్తి న్రామచంద్రప్రభూ! 61

శా. ఎవ్వండైనను జేసె నే నెదియొ దుష్కృత్యంబు గర్వంబునన్
నవ్వంగూడ దొరుండు వానిఁ గని; మానైర్మల్య మిట్టేసదా
దవ్వై మమ్మెడఁ బాయకుండు ననుచున్ధైర్యంబుతో నిల్చి వా
క్రువ్వ న్శక్తులు గారు నీయెదుట నేరున్ రామచంద్రప్రభూ! 62

శా. ఏయేవిద్యల నభ్యసించి తనుచుంబృచ్ఛింప వీవెప్పు, డిం
కేయేసత్కృతు లాచరించి తనుచుం బృచ్ఛింతువే కాని; యెం
తో యాహ్లాదకరంబుగాఁ బలికి తోహో! యంచు నా, కచ్ఛమా
న్యాయోపేతచరిత్ర మెచ్చుకొనుదయ్యా! రామచంద్రప్రభూ! 63

శా. ఆయత్యున్నతు లుండుభూరుహమ్ము వాత్యాబాధపాలౌఁ దృణం
బాయాసంబును జెంద దట్టు; లటె యౌద్ధత్యాధికుం డొందెడున్
మాయాబాధలు సంసృతి, న్వినయసంపన్నుం డటు ల్గాక తా
హాయి న్జేయును జీవయాత్ర జగదీశా! రామచంద్రప్రభూ! 64

శా. ఔచోఁ గానిస్థలంబున న్నిజమహత్త్వావిష్క్రియోత్కంఠతో
వాచాడంబర మేచి చూప, కితరుల్వాక్రుచ్చువాక్యంపుసా
మీచీన్యంబు గ్రహించి దానివలనన్మేలొందుప్రోడండెపో
నీచిత్తంబున కించిధన్యుఁ డగుఁ దండ్రీ! రామచంద్రప్రభూ! 65

మ. తొలుతం జెడ్డతలంపు పుట్టు; నది తోడ్తోఁ జంపకున్న న్మదిఁ
గలుగుం దానికిఁ బుష్టి నిచ్చెడు నసంఖ్యాకంబు లౌభావనల్;
పలుదుర్వాంఛలు గల్గువెన్కఁ; గడ కావాంఛల్ క్రియారూపమై
కలిగించు న్సుఖనష్టి రెంటను, శుభాంగా! రామచంద్రప్రభూ! 66

మ. మరణం బొందెడువేళఁ, గుత్తుకకు శ్లేష్మం బడ్డమౌవేళ, నం
దఱు "నన్నెవ్వరి కప్పగించి చనెద?" దన్నాదంబె గావింతురి
ష్టులు శాంతిం జననీక; యచ్చటి నొకండున్నిన్నుఁ బ్రార్థించినీ
చరణాబ్జస్మృతిఁ దేఁడు వానికి! రమేశా! రామచంద్రప్రభూ! 67

మ. తనయిష్టానుసృతి స్పృహాంబుఁ దను చిత్తవ్యాపృతు ల్సాగుచో,
మన మత్యంతము శాంతినుంట యది సామాన్యంబె; యింకెవ్వఁడుం
డును శాంతాత్మతఁ గ్రూరకష్టదశయందు న్వాఁడె నీసత్యభ
క్తనికాయంబునఁ జేర్చుకోఁదగు ననంతా! రామచంద్రప్రభూ! 68

శా. అంతస్సార మెఱుంగ సాధనము గాదైశ్వర్యసంపత్తి, య
త్యంతంబైన ప్రలోభకార్థనిచయం బాపత్తులుం గాని; స్వ
ర్ణాంతస్స్థం బగు నిగ్గుఁ గాంచ నొరగల్లౌఁగాని స్నిగ్ధంబు భా
స్వంతంబౌ మొకమాలుగాదు జగదీశా! రామచంద్రప్రభూ! 69

శా. కాంతం గాంచనము న్శరీరసుఖము న్నా వంచు వర్జించి నీ
చెంత న్భక్తులు చేరుటేల? యన, నీశ్రీపాదపద్మద్వయీ
చింతాలభ్యసుఖంబు వానివలన న్సిద్ధించుసౌఖ్యంబుఁ దా
నెంతో మించి యొసంగుచుండుటనె, తండ్రీ! రామచంద్రప్రభూ! 70

మ. అనుతాపాగ్ని మదీయకిల్బిషవనం♦బామూలదాహంబుచే
సినవెన్కన్ భవదీయభవ్యగుణసం♦స్మృత్యాదులం బిట్టు నా
కనులం బుట్టుసుశీతలాశ్రుతతి నా♦కాఁక స్శమింపంగఁజే
సి, నను న్భక్తిసుధాబ్ధిఁ దేల్పఁగదవే ♦ శ్రీరామచంద్రప్రభూ! 71

మ. అకలంకాత్ముల దీర్ఘజీవనతఁ బు♦ణ్యాంగ బుధ్వేఁ జెంపొందు; దు
ష్కృతివాత్రితము దీర్ఘజీవనతిచే ♦ వర్ధిల్లుఁ బాపంబె; కో
రక తీర్ఘాయువు పాపి మృత్యువునె కో♦రంజెల్లు సద్దానవా
నికి న్యూనాఘపులాభ మౌను గనుక ♦ శ్రీరామచంద్రప్రభూ! 72

శా. నీపాదాంబుజచింతనాభ్రిధువిలో ♦ నేస్నానముం జేసి, నా
పాపౌఘంబులఁ గడ్డినై మకొని శు♦భ్రిస్వాంతత న్నిగ్చి, నీ
రూపంబు న్మదిఁ గట్టి, మృత్యువును ని♦ [illegible] ! యం
చాపద్బాంధవ! పల్కు సంభయాతి నీ♦వా? రామచంద్రప్రభూ! 73

శా. అన్నం బంబువు లగ్ని గాలి పొగబం ♦ డ్లాకాశయానంబు లిం
కెన్నో మానవసౌఖ్యసాధసము లీ♦పృథ్విం బ్రతిం జెచ్చు; ని
ట్లున్న, "జీవితమధ్యమందు మృతిలో♦నున్నాను నే" నన్నమా
ట న్నీమాయ జడుండు తా మఱచుఁ గ♦ర్గా! రామచంద్రప్రభూ!74

మ. సువిచారంబున నెవ్వఁ డిల్లు టనఁగాఁ ♦ జూకార్ల మార్పించునెం
చి వపుర్నాశముకై భయంబు మదిలోఁ ♦ జెందండొయాతండు మృ
త్యువు నిర్జించినశూరుఁడే యనఁదగున్, ♦ దోఁబుట్టునట్లే యతం
డవలోకించును మృత్యుదేవతి మహా♦త్మా! రామచంద్రప్రభూ! 75

శా. చావుం బొందినవానికై పొగులు చ♦శ్రాంతంబు నిస్వేదమం
దేవాఁడుం బడియుండఁ; డెప్పటివలెన్ ♦ సృష్టిస్థమౌ సర్వముం
బోవు న్సాగి; యటంచు వెంచు నెడల♦న్శోకాదుఁ దోషో సహం
భావం; బంతి నరుండు ధన్యుఁ డగుఁజ♦న్మాత్మ! రామచంద్రప్రభూ!76

మ. గదిలోనుండి మఱొక్కచోగదికి నేఁగ న్రేయి బాలుండు తా
బెదరు న్మధ్యతమఃప్రదేశము సొరన్ ♦ భీకారణాభావ మం;
దిదియే మాదిరి మృత్యుభీతి గదురు ♦ న్హృద్వీథి నజ్ఞాని కం
చుదితం బౌ నుడి సత్యమైన నుడిగాఁ ♦ దో? రామచంద్రప్రభూ! 77

మ. నొగులౌ నెత్తగు రెండుపీఁటలపయి ♦ న్గూర్చుండ యత్నించినన్;
వగయౌ నిర్వురు స్వాములం గొలుచు దు ♦ ర్భాగ్యంబు ప్రాప్తించినన్;
జగతి న్నీకు ధనాధిదేవతకు స ♦ ర్చ్ఛ్లేసయ నుంకించినన్
సుగము న్మేమట కొలుపోదు మిట నం ♦ దు, రామచంద్రప్రభూ!78

మ. తనకే దన్యులు చేయఁగా వలయు న ♦ న్నాత్మపర్యమో తాను దా
నిని జేయ న్వలె వారి; కన్యు లిఁక దే ♦ నిం జేయఁ దానొచ్చు దా
నిని జేయం దగ దెప్పు డన్యులకు; దీ ♦ నిం బట్టి సాగించు జీ
వన మెవ్వాఁ డతఁ డ్లాను రేఁట సుఖి దే ♦ వా! రామచంద్రప్రభూ!79

శా. ఏదె ట్లుండును మోఁల నద్దియె యటే ♦ వీక్షింప నౌ స్వచ్ఛమౌ
నాదర్శంబున; నట్లె దృష్టలకుఁ జి ♦ త్తావస్థ యెట్లుండు న
ట్లే దృష్టం బగు లోక మెల్లఁ; గనుకన్ ♦ సృష్టిక్షితంబైన దో
షాదు ల్మావియె, కావు దానివి, మహా ♦ త్మా! రామచంద్రప్రభూ!

శా. కోర న్రాదిహసౌఖ్య మేది సిను భ ♦ క్తుం; డల్లరాధాంగనా
పారప్రేమయు నిస్పృహత్వ మెద దై ♦ వాఱంగ, వాసోజఁగా
హారాదు ల్సకలంబు నీవె యనుచున్ ♦ ధ్యానింప నౌఁ; బ్రార్థనన్
చేరం బాడుట మాకుఁ గూడదు కృపా ♦ బ్ధీ! రామచంద్రప్రభూ! 81

శా. శారీరామయపీడఁ బోవును మనస్స్వాస్థ్యంబు; లోలాంబు కా
సారంబట్టులు చిత్త ముండు నెడ ధ్వ ♦ స్తంబౌను ధ్యానంబు; నిం
డార న్భక్తిఫలంబు నిచ్చుట కవ ♦ శ్యం బందుచేఁ బూర్ణదే
హ రోగ్యం బని పెద్ద లందురు రమే ♦ శా! రామచంద్రప్రభూ! 82

శా. స్వాపాహారజలంబుల న్మరలఁ బుష్టం బయ్యెడు న్జీవన
వ్యాపారంబుల జీర్ణమై చెడిన దేహాంశంబు; లవ్వానిచే
నేపుం గాంచు మనంబుగూడఁ; గనుకన్వైయార్థనిర్వృత్తికై
మాపం గూడదు భక్తసారము మహాత్మా! రామచంద్రప్రభూ! 8

శా. సుతానార్థమె పెండ్లికాని సురతేచ్ఛాభోగ్యసృష్టిసంభూతమా
సంతోషంబున కిప్డు గా దని శ్రుతుల్ శాస్త్రంబులు న్జెప్పుటన్,
గాంతాభోగపరాయణత్వము నణంగం ద్రొక్కి గేస్తుండు తా
శాంతి న్దాంతి గడింపఁ జూపవలె, నీశా! రామచంద్రప్రభూ! 84

మ. విమలాంతఃకరణంబు, దేహబలము, న్విఖ్యాతిధీశక్తి, ధై
ర్యము, విత్తాఢ్యత, నూత్నకల్పనసమర్థత్వంబు, దేశంబు, స
ర్వముఁ గోల్పోవుటకుం గతం బరయ నార్యస్తుత్యసద్బ్రహ్మచ
ర్యము లేకుంటయె యంచుఁ దోఁచు రఘువీరా! రామచంద్రప్రభూ

మ. క్రిమిసందోహమువంటిసంతతి, కభుక్తి న్దేశ మందెల్లఁ బ్రే
తము లట్లుండెడు వారికిం గొద వొకింతన్లేదు! సద్బ్రహ్మచ
ర్యము తర్వాత గృహస్థులై కనిన శౌర్యస్ఫీతులౌ వారు మా
త్రము కాన్పింపరు నిన్నుబోంట్లు మహితాత్మా! రామచంద్రప్రభూ!

శా. వాసంబందునఁ బెద్దవారినడత, వైవాహికాచారముల్,
గ్రాసంబందున లేమి నేమము, లసద్గ్రంథాదులు, న్రింతుకై
యాసంకల్పలఘుప్రసంగములు, నిత్యాదు ల్మతెన్నో శమా
భ్యాసోరుప్రతిబంధకంబు లగు దేవా! రామచంద్రప్రభూ! 87

శా. నీరాహారసుషుప్తివాంఛల నెటుల్నిర్జింపలేఁడో సరుం,
డారీతి న్వనితాభిలాషయును దాసడ్డంగి లేఁ డంటని
స్సారాసత్యపుమాట కానియెడ, భీష్మప్రాయు లైనట్టిలో
కారాధ్యు ల్భువి నుంటసాధ్య మిపు డెట్లా? రామచంద్రప్రభూ!

శా. హిందూదేశపుఁ బ్రస్తుతస్థితికి నెన్నేఁ గారణాలున్న; విం
కందు న్బాల్యవివాహము ల్కనఁగ మూలాధారము ల్వాటిప
ర్యందోహంబుల కంచుఁ జెప్పుదురు పెద్ద ల్పెక్కు; రామాట ని
స్సందేహం బని నాకుఁ దోఁచెడు రమేశా! రామచంద్రప్రభూ!

మ. తినునాహారముఁబట్టి యుండు మనము న్దేహంబు; జిహ్వేంద్రియం
బును స్వాధీనముచేసికొన్న నితరంబు ల్వశ్యమై యుండుఁ; గా
వున, నద్దానిని బ్రహ్మచర్యనియమంబు న్నిల్పుకోఁ జూచువాఁ
డు విరోధించుక వర్తిలన్వలయు నెప్డు న్రామచంద్రప్రభూ! 90

మ. శమసంపత్తి, చిరాయు, వద్భుతమనీషాశక్తి, యారోగ్య తే
జముఁ, ద్వత్సృష్టిరహస్యవేత్తృతయు, నిచ్ఛాసత్వపుంబెంపు, స
త్యముగా నిన్ను నెఱుంగఁజాలు మహితత్వంబు, స్సదాబ్రహ్మచ
ర్యముసం గల్గు నమూల్యలాభములు దేవా! రామచంద్రప్రభూ!91

మ. విమలస్వాంతత నిన్నుఁ గొల్వనో, రుజావృద్ధవ్యపీడార్తులౌ
తమవారిం బరిచర్యలం దనుపనో, దైన్యస్థమానాత్మదే
శము సేవింపనో, పెండ్లిమానుకొని యిచ్ఛాపూర్వకబ్రహ్మచ
ర్యముతో నుందురు కొంద ఱుత్తములు దేవా! రామచంద్రప్రభూ!92

శా. తన్నట్లే సకలేతరోరుతరభూతవ్రాతముం జూచుకొం
టున్నం గష్టతమంపుఁగృత్య మగుచో, నిం కన్యజీవాళియం
దు న్నైసర్గికవృత్తిమైఁ బొడమునాదు ర్ద్వేషభావంబుతోఁ
దన్ను న్భక్తుఁడు చూచుకోవలయు సీతారామచంద్రప్రభూ! 93

మ. వినయం బున్న సమస్తసద్గుణము లావిర్భూతమౌ; నద్ది భ
క్తున కావశ్యక మైనలక్షణము; తన్మూలంబుపై నిల్చుఁ ద
క్కినయాధ్యాత్మికవృద్ధి యంతయును ముక్తింగూర్చుసామగ్రియుఁ;
ఘనసౌధంబు పునాదిపైనె నిలుచుం గా! రామచంద్రప్రభూ! 94

మ. ధనవిద్యాదులపెంపుచే నరున కౌద్ధత్యంబు రానున్నచోఁ
దనకంటె న్బలవత్తరుం దలఁచి డిందం జేయ నౌ దాని; నిం
కను గష్టంబులఁ గల్గుకుందు నడఁపంగానౌఁ బ్రపంచంబులోఁ
దనకంటెం బృథుకష్టజీవిఁ గని; సీతారామచంద్రప్రభూ! 95

శా. రానున్నట్టి విపత్తుల న్నరుఁడు నేరం డడ్డి యాఁపంగఁ దాఁ;
గాన, న్వానిని ధీరచిత్తతఁ దితిక్ష న్సైఁచుకొం టొప్పు; నేఁ
డేని న్నీరధిఁ గూలి పీతధృతియై యిట్టట్టు తాఁ గొట్టుకో
కా నీటం బడియున్నఁ దేలి మను; నీశా! రామచంద్రప్రభూ! 96

మ. శ్రమ మెంతెక్కువయైన దానివెనుకం బ్రాప్తించు సౌఖ్యంబు గా
టమె యా నంతగ; నిన్నె నమ్మికొనియుంటం గల్గు మోదంబుతో
సమమా మోదము లేమి, నద్ది యగుఁ గష్టం బందునేకానఁ, గ
ష్టములే భక్తులు కోరుకొందు రెపు డీశా! రామచంద్రప్రభూ! 97

మ. ఎవఁడుం దాఁ దనచర్మచక్షువులతో హృద్భావనాతీతమౌ,
రవికోటిద్యుతి మించుదీప్తి గలదౌ, బ్రహ్మాదిదేవార్చ్యమౌ,
భవదీయాకృతిఁ జూడలేఁ డని కృపన్ భావించి యపప్పు గ
వవతారంబుల నెత్తుచుందు పరమేశా! రామచంద్రప్రభూ! 98

శా. „నీపాపంబులఁబట్టె సిగతులు నిర్ణీతంబులౌ" నందువే,
నోప న్నే నిలునంగ నీయెదుట న్యాయోద్వృత్తికిన్! నీ విఁకే
పాపౌఘం బవలీలక్షాళిత మొనర్ప న్దక్షమా సత్కృపా
కూపారం బవు! నన్నుఁ బ్రోవభర మొక్కొ? రామచంద్రప్రభూ! 99

శా. „నీకర్మం" బని కన్ను దుడ్చి చను, దంతే కాని, నీవే సదా
వాని న్భావముఁ గర్మము న్నడపి సర్వప్రాణులం ద్రిప్పు దీ
లోకంబందున; నిద్ది దూషణముగా లోనెంచి కోపింపక
య్యా! కేల్మోడ్చి నమస్కరింతుఁ బరమాత్మా! రామచంద్రప్రభూ!

క. వందనము సుందరాంగా!
వందన మపవర్గసౌఖ్య•వరదాయి! ప్రభూ!
వందనము దేవదేవా!
వందన మోజానకీధ•వా! శ్రీరామా! 10

క. వందన మానందాత్మక!
వందన మోచిత్స్వరూప! • వందన మభవా!
వందనము భక్తకల్పక!
వందన మఖిలప్రపంచ•పాలక! రామా! 10

క. శ్రీరామా! శ్రీరామా!
శ్రీరామా! రామ! రామ! • శ్రీరఘురామా!
శ్రీరామా! శ్రీరామా!
శ్రీరామా! రామ! రామ! • సీతారామా! 10

శ్రీ శ్రీ శ్రీ

